## శ్రీ జాషువకవిగారి ఖండకావ్యములు

| | | | |
|---|---|---|---|
| ఖండకావ్యము | 1 వ భాగము | 1 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 |
| డిటో | 3 వ భాగము | 1 | 0 |
| డిటో | 4 వ భాగము | 1 | 4 |
| గబ్బిలము | 1 వ భాగము | 1 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 |
| పిరదౌసి | | 1 | 0 |
| నేతాజీ | | 1 | 0 |
| బాపూజీ | | 1 | 0 |
| కాందిశీకుడు | | 1 | 0 |
| స్వప్నకథ | | 1 | 0 |
| ముంటాజ్‌మహల్ | | 1 | 0 |
| స్వయంవరం | | 1 | 4 |
| తెరచాటు (నాటకం) | | 1 | 8 |
| వీరాబాయి (నాటకం) | | 1 | 8 |

# విషయ పరిచయము

శ్రీరామచంద్రుని చరిత్రమును పూర్వులు పలువురు పలువిధముల వాక్రాని, దూకొని ధన్యులైనారు. తొల్లింటి కవుల యడుగుజాడల నేను గూడ ఆ రఘూత్తము కథామృతము ఖండఖండముల నాస్వాదింప దమిగలిగి పంచవటి, చిత్రకూటము, అశోక మను పేరుల కావ్యసరస్సుల నిర్మించి నా యభీష్టము కొంతకు కొంత నెరవేర్చుకొనగలిగితిని.

ఈ చిన్ని కావ్యమును నా యేర్పరచుకొనిన రామాయణములో నొక ఖండము. ఇందు శబరి భక్తితన్మయత్వము చూపఁబడినది. ఇయ్యది చిత్రించుటలో అధ్యాత్మరామాయణము స్మరణయందుంచుకొని ప్రజావాణిలో దిరుగుచున్న 'శబరి విందు' అను జానపద గేయమును విస్మరింపక శబరి ఆశ్రమమునకు సీతాదేవితోఁగూడ రామలక్ష్మణు లరుదెంచినటుల ధ్వనింపఁజేయబడినది. ఇయ్యది పాఠకలోకము గుర్తించుగాక.

—మాధవపెద్ది

# రా మ దూ త

చదువంచున్నది యేమొ యున్నయదిలే చాలింక—సంగీత నా
రద సాహిత్య చతుర్ముఖత్వములు సే రమ్మన్న రానేరవీ
ముదిమిన్—బుట్టుకతోడ నాకవనమున్ బొమ్మన్న బోఁబోవ దం
త్యదశన్ సైతము—నిల్పుమోయిహనుమన్నా! దీని నాకల్పమున్.

సాహసమే నిజమ్మనకుఁ జాలదు శక్తి, మనమ్ములోని యు
త్సాహము నాపనోప నొక సత్యమహర్షి దయాళు విచ్చు ప్రో
త్సాహమె యిందుడించినది దాసుని ఆదుకొనంగ లేవ! రా
వా హనుమాను! రామభగవానుచరిత్ర రచింపఁజూడవా?

లోపల నంతలోఁ దళుతళుక్కుమనుంజుమి పాదుకాంత దీ
క్షపరులేనియున్ దెలియఁజాలని మంత్రరహస్యకోటి ని
ర్లోపఁగఁజేసి యీకవనయోగమునం గృతకృత్యుఁ జేయగా
నీపయి భారముంచితిని, నీళుల ముంచెదొ పాల ముంచెదో.

భూతలమాదిగా భువనముల్ పదునాల్గిటఁగూడ నేది వి
ఖ్యాతమొ యెందుఁ బ్రోక్తమగు నక్షరమాత్రముచేతనే మహా
పాతక నాశనంబగునొ పావని! యా రఘురామచంద్ర భూ
నేత కథాసుధారసము నేను నిమిత్తముగా వెలార్పవే.

నీకవనమ్ములోన గల నిగ్గునుజగ్గును లోతుఁబాతు వా
ల్మీకియెగాని యొడ్లెఱుఁగ లేరట శేషుఁడొకండె నీ నవ
వ్యాకృతి పాండితీవిభవ మాశయ గల్గినదంటయుఁట రా
వే కరుణించి నూల్కొనవె, వే కృతి పూర్తిఁజేయ మారుతీ.

పాదమొకండు పూర్వగిరిపై మఱియొక్కఁడు పశ్చిమాద్రిపై
నూది సమస్తమైన చదువొక్కదినమ్మున నీగ్రహించుటన్
మేదిని నీవు సూర్యు దిగమ్రింగితివన్నది పుట్టఁబోలు తం
డ్రీ! నయదెల్పవే యిటుల దేవరహస్య మొకొక్క డీకృతిన్.



# స ం ద ర్శ న ము

అది చిన్నిచిన్ని ముత్యాలు ముత్యాలుగా
సెలయేటిలో నీరు చిలుకుచోటు
ఆ చిన్ని నీటిముత్యమును ముద్దు
లొలుకు నా సమయ మరోక్ోదయమ్ము
ఆ స్వర్ణ సూర్యోదయమ్ము పర్వత పర్వ
తాంతరాంతర భూరుహాంచలముల
ఆ యంచలములపై నాడు నా యాటుణ్యో
మహాహా ! యెంతటి హృదయంగమమ్ము

ఆ యకృత్రిమ రామణీయక వినూత్న
రత్నకాంతి ప్రవాహ నీరాజనమున
రాజిలుచు నున్నయతఁడె శ్రీరామమూర్తి
జలధరశ్యామ సుందర చక్రవర్తి.

## శబరి

మాణిక్యముగ విశ్వమాతృ గర్భమునుండి
యావిర్భవిలిన ప్రత్యక్షలక్ష్మి
చందనాంకురముగా జనకరాజమహర్షి
సాకుకొన్నట్టి కన్యాకుమారి
జాజితీగెగ రామచంద్ర మందారమ్ము
నాశ్రయించిన తదాయత్తచిత్త
తోడునీడగ భర్తతో ఘోరకాంతార
మనుగమించిన ప్రణయప్రపూర్ణ

ధరణి జనయిత్రి, తనసహోదరు లొసంగు
జేగురుం గుంకుమము నారచీరదాల్చి
చూచితీ సీత చక్కని చుక్కలీల
నెటుల నిల్చెనో జీవితేశుమ్రోల.

మృదు మధురస్మిత పూర్వక
మదిగో! శ్రీరామచంద్రునానన బింబా
భ్యుదయమయి వెడలుచున్నది
యదనిదియేసుమ్ము తద్వచోమృతమానన్.

కోరినంతగ ఋషిహోటు లారాధింప
వారణంబొనరింప ఫలరసమ్ము
తీర్థమాడంగ నదీప్రవాహజలమ్ము
వస్త్రమ్ముగ ధరింప వల్కలమ్ము
జపతపమ్ములఁ దీర్ప సాంద్రవృక్షచ్ఛాయ
అట నధిష్ఠింప గృష్ణాజినమ్ము
ఆనందమొంద నాత్మానుసంధానమ్ము
విశ్రమింప స్వయంకృతాశ్రమమ్ము

పవ్వళింపంగఁ బచ్చికప్రంపుటనఁటి
యాకుఁ బాకను లేఁజివురాకు పాన్పు
కలదె ? లక్ష్మణ ! స్వర్గలోకమునసైనఁ
బావనంబీ మహారణ్య జీవనమ్ము.

పఱచిన రత్నకంబళము లట్లలరారు
సెలయేటిగట్ల పచ్చికబయళ్ల
గోగణమ్ముల మేపుకొనుచు నాలాపించు
విప్రబాలుర సామవేదగీతి

శ బ రి

ప్రతి ఋషీశ్వర కుటీరమ్ము వెల్వడివచ్చు
వైశ్వదేవ సుగంధవాయు లహరి
ఫలభారమూని చూపఱకు నమ్రత్వమ్ము
బోధింపవ్రాలిన భూరుహములు

ఆశ్రమ మహీరుహమ్ముల కవలిసువలి
యపరసంధ్యా సువర్ణ సూర్యాస్తమయము
ఆమహీరుహ మందసుందానిలముల
హాయి యలవడు టెంతపుణ్యమున వత్స!

ఫలవృక్షముల మధ్యభాగమునం దొక్కొక్క
యతికి నొక్కొక్క పుణ్యాశ్రమమ్ము
ఆశ్రమాశ్రమమునం దఖిల విద్యాబోధ
కొఱకునై యొక్కొక్క గురుకులమ్ము
గురుకులమ్ములఁ జుట్టుకొని దున్నకండ నీ
వారమ్ము పండు కేదారకములు
కేదారకములలో గ్రింద రాలినయట్టి
కొఱచు భక్షించు శకుంతకోటి

ప్రతి శకుంతము సాయంప్రభాతములను
దినదినము( బాడు తీయని తేనెగీతి
గీతిగీతియు శబ్దించు గిరులదరుల
రమ్యగంభీర మిమ్మహారణ్యభూమి.

నిమ్మకు నీరమెత్తినటు నెమ్మది నుండును భ్రూ వికార నా
ట్యమ్మె యెఱుంగ రిచ్చటి గృహవ్రతు లెంతటి పుణ్యమూర్తులో,
యిమ్మహనీయులైన ఋషులే సుమి లక్ష్మణ ! వారిధారసా
మ్యమ్మున నున్నవారు భువి మానవ ధర్మలతాభివృద్ధికిన్.

తెరువరు లెవ్వరేని యరుదెంతురొకో యని ద్వాఃకవాటమున్
తెఱచియె యేగు నొక్కెడ నెదేపనియున్న గృహస్థు — వచ్చుత్రో
వరులును, ఎంత గావలసివచ్చునొ యంతకె వాడిపోవుచుం
దురు తమదారి వస్తువుల తొంటియటుల్ పదిలమ్ము సేయుచున్.

సమిధలు తెచ్చి యీయ(గ గజంబులు, వేళయెఱింగి యంచలున్
నెమిళులు ఱెక్కలన్ విసరి నిప్పు రవుల్కొన(జేయ నగ్నికా
ర్యము నిరతమ్ము దీర్తురటె యత్రిమహర్షులు, తత్తపఃప్రభా
వము గన( జిత్రమౌ పసులు పక్షులకేనియు భక్తిభావమే.

అశరీరంబగు వాక్కు చేత నుపసంహారమ్ముతోబాటుగా
నిశితాస్త్రమ్ములనే పరశ్శతమునో నిర్మించుటేగాక బ్ర
హ్మ శిరోనామకమే సృజించిరి మహాస్పందుండి నేఁడెంతగా
వశమో చూచితె యీ ఋషీశులకు శబ్దబ్రహ్మమో లక్ష్మణా!

అక్షరసంపుటీకరణ మందెటులీ ఋషికోటియట్టి వి
శ్వాక్షుని విశ్వతోముఖు ననంతు నిముడ్చిరొ యింతలేని పం
చాక్షరిఁ బంజరంబు శుకమౌ నెటొ యంతటి విశ్వమూలుఁడా
రక్షకుఁడెంత విస్మయమురా సరిలేదుర బ్రహ్మవిద్యకున్.



ా

.

# శబరి

నిరతమ్మున్ బచనాదికృత్యములకున్ నీవాక్క పంపాసరో
వరతీర్థమ్మె గ్రహింతు వీ యుపయు మవ్వా! యేలొకో పూఁబోదల్
గురియన్ దొన్నెలఁ బట్టితెచ్చితెటనో కోనన్ దుషారమ్ము నీ
గురురాణ్మౌళి తపస్విచంద్రుఁడు మతంగుం డిందు విచ్చేయునే?

అవునులే యంతకన్న నెక్కువ మజేప
తపసుఁజేసెను పెంచి పెద్దగ నొసర్ప
నిజము నమ్ముము నాతల్లి! నీవటన్న
నాఁడు మూన్నాళ్ళ గ్రుడ్డునుగూడఁ గావు—

పుట్టిన నెత్రుకందునినుఁ బుట్టినతే పడవైచి పోవఁగా
నెట్టులఁ జేతులాడినవొ యే యసిఘాతముచేత నామనం
బట్టులుగా శిలాకఠినమైనదొ చెప్పఁగలేము తల్లి క
న్నట్టు ఋణానుబంధమది యక్కడికే సరిపోయె నంబికా!

పువ్వుకన్నను బువుతోడఁ బోల్పఁబడిన
యేదొ మఱియొండు మనమున కించునట్లు
సంతతిం గంటకన్నను సంతతిగను
జూచుకొనుచుంటలోననే చొక్కె మౌని.

ఒక్కగా నొక్కరితగాగ నున్నయట్టి
సుతనె మఱచెను నినుగొంటసుతగ మౌని
చుక్కకద! యయ్యరుంధతి చూడుమమ్మ
దైవచిత్ర మ్మదెంత కెంతకును జాలు.

ఆవిధ మంతటితోడం
బోవక యమ్మౌని హృదయపుట ముద్రితమై
దైవమును దైవమనుకొన
నావలన విశేషమేమియని యనిపించెన్.

ఏవస్తువైన నటువై
దైవముగాఁ జూచుకొనుచుఁ దల్లి! మూలం
బీ పాటనెగద యాత్మ పు
రోవృద్ధి నతండు విశ్వరూప మెఱింగెన్.

సరికానీ యది, కాచికాచి తపసుం జాలించుపై నోటి ముం
దరికిన్ శిష్యులు దెచ్చియిచ్చు ఫలమాత్రంబేని గైకోఁగ గ
న్దెరువండే యొక కొన్నినాళ్లగ సమాధిన్ నీదు సన్నాహమున్
బరమోత్సాహము దన్నిమిత్త మెటు లవ్వా! సుంత వాక్రువ్వవా.

తరుబాలలు ముద్దుం బూవు
లిరుచాయల నద్దుచుండ నెంతేని మనో
హరమంబ! పాటుటాకుల
విరచితమది పసిఁడిజేకు విడుదలకంటెన్.

మరకత తృణవేదిక లే
ర్పఱచితి కూర్చితి ప్రవాళ పర్యంకమ్ముల్
చిరపరిచిత ప్రదేశమె
సరి క్రొత్తంజూతు సారెసారె కిదేమొ.

గ్రువ్వం గాఁబడినట్లుగాకను కుదుర్కొన్నట్టు లే పువ్వు కా
పువ్వే తానయి పుట్టివచ్చినటులే పూదండ కాదండయే
అవ్వా! చిత్తము విస్మితంబగును నీ యావేగముం జూడఁగా
నెవ్వా రెంతటి పూజ్యపాదులిటుగా నేతేరగానుండిరో.

అది యే మిట్లరుదెంచుచున్నది పసుష్యాకారతంబూని యి
య్యుదయారుణ్య హిరణ్మయప్రభయు విద్యుల్లేఖయున్ నీల తో
యద మాహా!—యిపు డెంత్రలో(జెదరె? జూపవ్వా! యెటుల్! నిత్యస
త్య దయారాసులు లక్ష్మణానుగత సీతారామ లోకేశులా ?

పఱతెంచు త్రోవ జిక్కఁ
బఱుపంగా లక్ష్మణుండు పలుకాడుచు నిన్
దరియుచు నున్నారదె నీ
చిరకాల తపఃఫలములు సీతారాముల్.

ఓ శబరి! వచ్చిరిదుగొ ఫ
లాశను లభ్యాగత స్వయంపిష్టువులై
దాశరథులు నీ యెడల ద
యాశరథులు స్వగతమేల స్వాగతవేళన్.

ఎదురునని తోడుకొని త్రే
వెదుటికి వారంత వార రేతెంచిన నే
మిది కన్ను లప్పగించెదు
ముదియవ్వా! యర్ఘ్యపాద్యములె కొనితేవా ?

ఈ పాటి నీరమర్ఘ్యమె
నా పాలిటి రామచంద్రునకు నని వగచే
దూపిలిదూపిలి గ్రమాన్పడి
తో పాప మిటున్నదాన వున్నటు లంబా !

ఆపో జ్యోతిగదా యత
డా పాదంబంటి వెడలునది యెదియైనన్
దాపత్రయ హారమగు గం
గాపగ యగుగాద ? జనని ! యది సరికానీ.

కడకు నొక చుక్కయునులేదె కనుల, మున్నె
యున్న బాష్పంబు సర్వంబు నోడ్చినావె ?
అల్ల యుదకమె ప్రత్యక్ష మయ్యెనేమొ
అమ్మ ! నారాయణస్వరూపమ్ము గాగ.

ఎందెందులకేగెనొ త
త్సందర్శనమునను దిరిగి తత్సంస్పర్శన్
డెందము కుదుటంబడె నే
మందునొ తడవుచును బెదవు లాడింతుగదే.

శ్రమ యింతో యిడినాను స్వామి! సయిరించంజెల్లు నిన్నెంతదూ
రము రప్పించితి నేమి సేతు మృతిచేరన్ రాఁ దపస్సంత తీ
వ్రము గావింపక తప్పదయ్యె, నినుఁ దీరా చూడ నో యంత్యకా
లమునందన్న భయమ్మె యింతకును మూలంబయ్యె రామప్రభూ!

కృప యీనాటిక? యేది నీదు నగుమోమేదీ యిటుల్ చూపు— దూ
రపుఁ జూపానదు రమ్మ డగ్గరకు వార్ధక్యము మెండయ్యె! పు
న్నెపుడో రాలక నీ నిమిత్తమె సుమా! యేనింతకాలమ్ము భూ
మిపయిన్ నిల్చుట యెల్లఁ—జూడు మెటులన్ మేనెంత జీర్ణించునో.

నడలో నెంతటి యందమున్నయదిరా నాయన్న: భూదేవి నీ
యడుగుల్ ముద్దిడికొంచు నున్నదియొకో యన్పించె నీ విట్లు కా
లిడిరాగా యొక యింత పల్కుగదవోయీ యెట్లు చెల్లింపఁ జొ
చ్చెడినో చూతము శారదాచరణ మంజీరమ్మె సుంకమ్ములన్.

తరుణుండా! తరుణమ్ము వచ్చెను, ధనుర్ధారీ! ఇటుల్ రమ్ము డ
గ్గఱగా నా కభయంబొసంగ.... గవచీ! కాపాడుమా, ఖడ్గి! నా
దురితమ్ముల్ తెగటార్పఁగావలెఁ జుమా, దుర్వాదళశ్యామ! మ
త్పరమైయుండును శ్రీ వికుంఠనగరీ ప్రాణప్రయాణమ్మునన్.

రాతిన్ నాఁడొక నాతిఁజేసితివి స్పర్శన్, దర్శనంబిచ్చి యీ
నాతిన్ నేఁడొక రాతిఁజేసితివి ప్రాణం బెప్పటట్లుంచి, యూ
హాతీతమ్ములు నీ మహామహిమలయ్యా ! చెప్పిచూడంగ నా
కే తన్మాత్రకు శక్యమౌనె మఱి నేనేమైన శేషాహినే.

నిద్రాహారములన్ ద్యజించితిని మున్ నీరాకకై — నేఁడు పూ
జాద్రవ్యమ్ముల సేకరించియు సమర్చ్యావాంఛయేలేక యే
త్వద్రూపమ్మునఁ జొక్కఁజొచ్చితిని—చిత్తం బెంతకున్ గూడఁ జి
న్ముద్రం బాయ దికెట్లు నీ కొసఁగికొందున్ దండ్రి ! యాతిథ్యమున్.

చరణము లిట్టులుంట సహజంబుగనె యరుణమ్ములౌటనా ?
కఱకుఁబథమ్ములన్ నడువఁ గందుటనా ? పరమప్రమోద భా
సురుఁడవుగాఁగ నాదు కనుచూడ్కికిఁ గానఁగవచ్చునెల్ల నీ
స్థిరతర ధర్మదీక్షయిడు తృప్తిన ? నీ నగుమోముచేతనా ?

చరణములు కడుగఁగా నీ
యరకాలే పద్మతీర్థ మందించెను నీ
కరముల కర్ఘ్యంబిడి మం
దిరముననే శంఖచక్ర తీర్థము లెనసెన్.

## శబరి

సురటులఁ జేసిన వాకుల
నరటులు, నీ వెన్క పీపునందలి వింజా
మరకేని పీవ నింతకుఁ
దరియించెడి యోగమున్న దారియు దొఱకున్.

నా పూర్వపుణ్య పుంజమ
నా పూజాఫలమ రామ! నాకుం జెపుమా
యీ పుట్టుక కిఁక జెల్లే
నా పునరావృత్తి నిరుపమానంద ఘనా.

చిరకాలమునకు నా నా
మరుచికి రూపమువచ్చె మదికే మున్ గో
చరమైన నీలమణిగని
చరితార్థంబయ్యెఁ జర్మచక్షువుగూడన్.

తహతహపడుటను నెంతటి
మహిమగలదొ నేటి కెఱిఁగె మది పూర్తిగ నా
గృహవర్తి రామమూర్తిగ
గుహలోపలి విశ్వమూర్తిఁ గొని యిటు తెచ్చెన్.

౧౭

అడవుల నొక్కఁడే తిరుగుటౌటను పొక్కఁగఁ బోలు బాదముల్
కడిగెదువేళఁ జేతి కఱకాళులు నివ్వరి నూగొయన్న కైవడి
వడి తవిలెన్ రఘుప్రవర! వానిపయిన్ హిమమిశ్రితమ్ము కా
బడిన పటీర చర్చయిడి పట్టుదు నీ సురటీ నొకింతగన్,

స్పృశియింపంగదవోయి యింత మృదులంబీహస్త మెట్లింత క
ర్కశమై యుండినయట్టి యా శివ ధనుర్భంగంబు గావించె నీ
వశమై యెయ్యది యెట్లుగాగనయినన్ వర్తిల్లెడింగాదె బా
లిశు లస్మాదృశు లే మెఱుంగెదరు నీ లీలా వినోదమ్ములన్.

కలశీ! శ్రీహరిపాదముల్ గడిగితే—కైసేసితే హారమై
తులసీ! నా వనమాలి కంఠమును—దోడ్తోరండు రండో ఫలం
బులు పానీయములున్ మనోరథఫలంబున్ దృప్తినొందింపఁ—జా
యల నిబ్బంబడి పట్టినార? తరులారా? పూల వింజామరల్.

తృణముల్ పచ్చలగద్దెలై నవి పువుల్ తీగెల్ మహాదివ్య భూ
షణముల్ గాఁ బరిణామమొందినవి నీ సంకల్పమాత్రంబుచే
నణువన్నట్టిదె మాఱదో యిటుల బ్రహ్మాండంబుగా మంటినే
మణిగావించెడి యా నభోమణిని నిర్మాణించి మా కీయవో.

చిటిపొటి పూలనేర్చి విరచించితి సూ : నవరత్నకాంతి సం
ఘటితపు ముద్దుటుంగరము కై వడిగా నొక తీగచుట్టు నీ
చిటికెనవ్రేలికిం దొడిగి శ్రీ రఘునందన : చూచుకోగ నీ
ఘటము ననుగ్రహింపగదె కన్నులకుం గఱువెల్ల డీఱగన్.

లక్షల్ స్వర్ణమణి ప్రభావిలసితాలంకారముల్ గల్గియున్
వీక్షాలంకరణమ్మొకండె తనకున్ విశ్వప్రభుత్వం బిడన్
స్సాక్షాద్విష్ణువు రామచంద్ర నరసంజ్ఞన్ నేఁడు నట్టింటిలో
నిక్షేపంబయి నిల్చెఁ గళ్ళయెదుటన్ నేనెంత ధన్యాత్మనో.

పుడమికి డిగ్గి నీ పరమపూరుషతన్ గడబెట్టుకొంటివే
కడకొక రాజగర్భమునఁ గల్గితివన్నది గూడఁ బోయి యి
వ్వడువునఁ బాదచారిగఁ బ్రవాస మొనర్పఁగ జొచ్చినావె కా
రడవులఁబెట్టి దమ్ము నిజమైన నరత్వము నిర్వహింపగన్.

చూచితె రామ : నీ కెదురుచూచుచు నా కనులిట్లు కాయలన్
గాచుటెగాక యాశ్రమమునం గల యీ తరులేనిఁ గాయలన్
గాచెను నీకు నర్పణ మొనర్పఁగ నెప్పటికేది యెంతగా
నోచునొ యేమొ యెవ్వరు గనుంగొనఁజాలెదరయ్య ముందుగన్.

విందును మీరలిట్టు లడపిం జరియించుట కంటి నేఁడు క
న్విందుగఁ గాని మీకు నిట విందునుగూడ నొసంగు భాగ్య మీ
బొందికి నున్నదంచుఁ దలపోయను—చిద్ఘనమైన యెంత యా
నందము గూర్చి రెట్టి కరుణాపరుణాలయులయ్యు రాఘవుల్ !

అది కంద మ్మొక యింతతెచ్చి యిడనా ? యానందకందమ్మ ! యి
య్యది మాకందము చెప్పనేల రుచి, మాయందాలకందమ్మ ! యిం
దెదియున్ మూలముసైతమున్ మధురమోయీ! వేదమూలమ్మ ! నీ
హృదయస్ఫూర్తి శుచిస్మితం బిటుల రానిమ్మా రఘూత్తంసమా.

ఎది యపరాధము జరిగిన
యదియో లక్ష్మణుఁడు కటములదరగ బెదవిం
గదలింపనుండెఁ—దెలియుద
మది ముందుగ, వేడుకొందమాపయి శబరీ !

లక్ష్మణుఁడు

పండులు మెండెగాని యెదిపట్టిన చిత్రము ! పక్షి యాడిన
ట్లుండె నిదేమిపాప మవిగో పలుగాట్లు; వివేకశూన్యవై
పండిన నీవు నీ తపసు పాడఱిపోవునటుల్ కృపాసము
ద్రుండగు రామభద్రు నొక రుద్రునిగా నొనరింపఁ జూతువే.

రుచిరఫలమ్ము లేర్పఱుపరో ఋషు లెవ్వరుగాని నీవలెన్
శుచి గమనింపరైరె? విధిచోదితమై యెటు భ్రష్టమయ్యె నీ
సుచరిత మంతయున్ గనిన సూనునకే యిడరాని యెంగిలె
ట్లుచితమటంచు నెంచితొ రఘూద్వహునంతటి విశ్వమూర్తికిన్.

అంబా! నీ యపరాధ మెంత మహనీయారాధనంబయ్యె లో
కంబం దెవ్వరి పుణ్యమింత పరిపక్వంబయ్యెఁ జేసాచెఁ జి
త్రంబీ యెంగిలిపండ్లకే రఘుకులోత్తంసంబు దైవంబు భా
వంబేచూచు నితఃపరంబు లితరుల్ పాటింతు రన్నట్టులన్.

బ్రదికితిమి తల్లి! యెంతయు
సదయుఁడు నీయెడల రామచంద్రుఁడు నీ విం
కెది చెప్పదలతొ చెప్పుమి
యదియెల్లను స్వామివార లాలింపంగన్.

ఒక్కొకపండె నే నొసఁగుచుండ రఘూద్వహ! యారగింతువే
ప్రక్కన గూరుచుండి కనుపండువుగా రుచు లెచ్చరించుచున్
జిక్కితె? నేటికిన్ దపసుచేయఁగ జేయఁగ వీవనీయవే
మక్కువదీఱ నా వలపుమామిడి లేఁజివురాకు వీవనన్.

నిరతధ్యాన ఫలించి యిప్పటికిగా నీ కోటికందర్పసుం
దరరూపామృత మారగించుచును జెంతంజేరి సీతామనో
హర ! హస్తార్పితముల్ పొనర్చుకొని యాయాపండ్లఁ దిన్పించితిన్
దరమా నా సుకృతమ్ము నెన్నుకొనఁగాఁ దైత్రిలోక్య మాణిక్యమా.

మామకభక్తియన్న దణుమాత్రము లేకెటు మాయమయ్యెనో
యేమిది యొక్కటే మమత యేర్పడె నీవొక బిడ్డవై నటుల్
రామయతండ్రి ! యింత మధురంబయినట్టిది పామరత్వమా ?
భూమిజనమ్ము దీనగద బొందినె స్వర్గసుఖమ్ము గాంచుటల్.

శ్యామలకాంతితోఁ గనులు చల్లనజేయుచుఁ గూరుచుండి నే
నేమి యొసంగబోవుదునొ నీవదియే ప్రియమైనయట్టు లెం
తే మురిపింపఁజొచ్చెదవు—నేఁడు గ్రహించితి బ్రహ్మచారిణిన్
బ్రేమరసమ్ము తల్లికెటు బిడ్డపయిన్ బ్రవహించుచుండునో.

నరరూపమ్మున వచ్చితే యతిథివై నాయింటి కీనాటికిన్
సిరిగూడన్ గనులందుఁ బెట్టుకొని నిన్ శ్రీమన్మహావిష్ణుగా
గుఱుతింపంగను బుండరీకములె యక్షుల్ చాలవే యేరికుం
డుర ? యింకిట్టి యనంతదృష్టి భవమూర్తున్ లేర నే నింతటన్.

తపసింబోలుచుఁ బాదముల్ గడుగనో — తల్లింబలెన్ జెక్కులన్
జుబుకంబున్ గొన ప్రేమలన్ బుణుకనో — నోరార నిన్ బిల్వగా
నుబలాటంపడఁబోనా — తండ్రివలెనే యోరంత ప్రొద్దేని నా
శబరీజన్మమె జన్మమన్నను రఘుస్వామీ! కృతార్థం జుమీ.

నా పాపక్షయమయ్యెరే సకలమున్ నా జన్మ మీనాటికిన్
సాఫల్యమ్ము గడించెలెమ్మ తులసీసమ్మిశ్రితంబైన నీ
శ్రీపాదోదక మారగించి పునరావృత్తిచ్ఛిదంబైన నీ
ప్రాపుం గాంచితి నింక నేమివలయున్ భాగ్యమ్ము నా పాలికిన్.

శిశువటు లాడఁజూచెదవు చేతులలోపలఁ జిత్రమౌ జగ
ద్దశభువనాధినేతవగు దైవశిఖామణివయ్యు నెంతగా
వశుఁడవొ భక్తికిన్ దెలియవచ్చెను నిశ్వసనమ్ములో దివా
నిశ మటులూగిపోయినది నీవని విశ్వసనమ్ము గట్టెడిన్.

నానాయజ్ఞఫలస్వరూపమగు సంతానమ్ముగా నాదిల
క్ష్మీనారాయణు నిన్ను గర్భమునఁ గాంచెన్ గాని కౌసల్య మ
ద్ధ్యానైకాగ్రత నీకు నీవె యిటు మత్సంతానమైపోవ స
న్మానం జొచ్చితి వెంతకన్నఁ గలదే యోగమ్ము యోగమ్మనన్.

నడచి గృహాన కీవు రఘునాథుఁడుగా నరుదెంచి నంతనే
యెడఁద గ్రహింపకున్నయదియే మును పెన్నఁడు నీదురూపు గ
న్పడనిదె క్షీరసాగరమునన్ శయనించు ననంత పద్మనా
భుఁడవె గదయ్య పూను ప్రతిముద్రను నా నడినాశమందునన్.

ఉభయత్వమ్మున కొఱకు నీవె తుదురై యున్నావు జాంబూనద
ప్రభతో నయ్యెడఁ బద్మనాభుఁ డనుపేరన్ నీలజీమూతస
న్నిభవన్ రాఘవుఁడన్నపేర నిచటన్ నిత్యుండవై దాననే
ప్రభు ! నీ నామము తారకం బుభయమున్ బ్రాపింప జీవాళికిన్.

ఆ నీ క్షీరసముద్రమే యిచట నా యాహ్లాదమై నిండెనా ?
యీ నా లక్ష్మణుఁ డయ్యనంతశయనంబేనా ? యిటుల్ చూడు నే
వేనా ధ్యాననిమగ్ననౌ నెడల నాయీచిత్తపద్మాన ల
క్ష్మీనారాయణమూర్తిగా వెలసెదో శ్రీరామచంద్రప్రభూ.

నిశితాస్త్రా ! ఖరదూషణాదుల వధన్ నీచేయుటం జేసి కొం
త శమించెన్ మునికోటి కిప్పటను దైత్యశ్రేణిచే బాధ, కా
ని శరణ్యా ! యెప్పు డివ్వనం బఖిలమున్ నిష్కంటకంబౌనొ ధీ
ప్వశరా ! నానవవర్షనీరద శరీరా ! హాయి చేకూరగన్.

మొగమున్ లక్ష్మణువంకఁ బెట్టుకొని చూపుౝ సీత కందించుచుౝ
స్వాగతంబా భరతప్రమేయముగ నీషన్మందహాసమ్ముతో
జగతీరక్షణ ధూర్వహంబయిన హస్తంబెత్తి భాషించు నీ
సొగసందెంతగ ముద్రితమ్ము కరుణాపూరత్వ మాత్మప్రభూ !

పరమేశుండని భక్తి మ్రొక్కుదున ? పాపండంచు లాలింతునా ?
ఇరుచందమ్ములు నొక్క నీయెడలనే నీక్షించుచున్ లోన ని
ర్వ్యాజపాటొందుచు మిన్నకుండుదున ? నీవే చెప్పవే వీనిలో
తరణోపాయ మదేదొ దాశరథీ నా దాక్షిణ్యపాథోనిధీ.

ఎడఁద యిదేమొకాని యొకతేమెయి నాట్యమొనర్పఁజొచ్చె లో
విడి ముడియేదొ పించియము విప్పిన నెమ్మివిధాన, నీవు నా
కిడియెడి లోకమేదయిన నిప్పటి నీఘనవిశ్వరూపమున్
బడసినఁజాలు నుమ్మిదియె ప్రార్థన నా రఘువంశవర్ధనా !

నరరూపమ్మున నున్న దైవమునకుౝ నా తండ్రికిౝ నీకు శ్రీ
హరి కాత్మార్పణమే యొనర్ప నిఁక నేలా సఖ్యముౝ వందన
స్మరణమ్ముల్ శ్రవణమ్ము కీర్తనము దాస్యం బర్చనాసేవనల్
వరముల్ మాత్ర మిఁకేల కేవలము నేవైకుంతమే మెట్టగౝ.

తాపం బెట్టిదియున్ శమించు నిఁక నంతఁబన్నదే తేని యే
పాపంబేనియు రూపఱున్ మదిని సంపద్గర్వదారిద్ర్యముః
ఖాపద్భీతు లడంగిపోవుఁ దముదామై, సర్వసంప్రాప్తికిన్
నే పాదాంబుజసేవ మూలము సుమా నిక్కమ్ము లక్ష్మీశ్వరా.

జగముల్ సర్వము కుక్షిలో నిముడ నిశ్వాసమ్ములై పోవఁగా
నిగమమ్ముల్ లవమేని వృద్ధియును హానిం జెందకే శంఖ చ
క్ర గదాద్యాయుధహస్తుఁడై కలశపారావారసంవాసియౌ
భగవంతున్ సకలార్తి సంకటతమోభాస్వంతుఁ గీర్తించెదన్.

హరి నారాయణు నాదివిష్ణు జగదేకారాధ్యు విశ్వంభరున్
బరమున్ భవ్యు ననంతు భక్తసులభున్ బ్రహ్మణ్యు సంసారసం
హరణున్ నిర్మలు నిర్వికల్పకుఁ ద్రికాలాబాధ్యుఁ గూటస్థు నె
వ్వరు నిన్ లోఁగనుఁగొంద్రో వారెసుమి జీవన్ముక్తు లాత్మేశ్వరా!

హృదయం బూర్ధ్వముఖం బొనర్చుకొని నిస్పైకాగ్రభావమ్మునన్
వెదుకంగా వెదుకంగ వాయు వొకఁడే విశ్వాయువై తోఁచి యం
దొడిగెన్ నాదము బిందువున్ గళయు నిస్వాహించుచున్నంతలో
నెద యేదో పెనుమోహనిద్రఁ బడిపోయెన్ నాఁడు చిత్రమ్ముగన్.

ఆ సూత్రాత్మగనున్న వాయువున కీవంతర్గతజ్యోతివై
యీ సర్వమ్ముఁ జలింపఁజేసెదవె తండ్రీ! లోకసామాన్య స
త్యాసత్యాతిగశుద్ధసత్యము త్వదీయ స్వస్వరూపమ్ము నీ
భాసమ్మున్ జిదచిద్విలాసమును దుష్పారమ్ము లాత్మేశ్వరా.

ఎటులీ చిత్రవిచిత్రపుం బ్రకృతి యయ్యెన్ దండ్రి! నీ నిర్మల
స్ఫటికాకారము వర్ణముల్ సయిత మస్మన్నేత్ర సంబంధులై
నటులే తోచెడి నూర్ధ్వమూలముగ దేహాశ్వత్థవృక్షమ్ము నీ
విటు కల్పించుటచేఁ గనంబడెద నీవే యిన్నిరూపమ్ములన్.

ఓంకారరూపిణే యుగధారిణే మనో
ధ్యానగమ్యాయ తుభ్యంనమోస్తు
అప్రమేయాయోదకాహూతి ప్రీతాయ
భక్తప్రియాయ తుభ్యంనమోస్తు
ప్రకృతేః పరాయ కారణ శరీరాయ రా
జాధిరాజాయ తుభ్యంనమోస్తు
రాఘవేంద్రాయ సర్వగతాయ వేధసే
సాక్షిమాత్రాయ తుభ్యంనమోస్తు

భవ ధనుఃఖండనాయ తుభ్యంనమోస్తు
ప్రార్థితాఖండలాయ తుభ్యంనమోస్తు
బ్రహ్మపూజ్యపదాయ తుభ్యంనమోస్తు
పరమకారుణికాయ తుభ్యంనమోస్తు.

కడచినదేదియో కడచెఁగాని రఘుప్రవరా!—యికన్ నినున్
విడువగనోప—నీదు వెనువెంటను నేఁ జనుదేరనోప—నీ
యడుగులు కళ్ళకద్దుకొను చాక్రమభూమినె యీ శరీరమున్
విడిచెద—నిన్నినీళ్ళు విడిపించెదె నీ శబరీనిమిత్తమై.

ఓయీ! కాయమిదెంత మోహజనకంబో యల్ల వైకుంఠ మే
స్వాయత్తంబయియుండినన్ శబరి నేనన్ స్వాభిమానమ్ము నన్
బాయం బోదనిపించుచుండెఁ బతనావస్థన్ సమేతమ్ము తం
డ్రీ! యేప్రాణికదే మహామధురమౌనే యిట్లు నీ సృష్టిలో.

ఆ వైకుంఠపురమ్మునుండి భవదీయాజ్ఞానుసారమ్ముగా
నా వాకింటికి వచ్చెఁ బుష్పకవిమానంబన్న యానందమే
యావిర్భావముగా దిదెక్కడి యిహ వ్యామోహమో విష్ణువై
రావే రాఘవ! యిట్టి సర్వమమకారమ్ముల్ నివారింపవే.

పూవల్ పాపము మాధవీవకుళముల్ పుష్పించుటం జూచియే
నీ పోఁగూడదొ యేను పెంచు హరిణంబే ప్రొద్దు నీరాడునో
యోపంజాలదు నా ప్రయాణమును లోనూహించి కాఁబోలు క్షో
ణీపాతమ్ముగ నోడ్చుచున్నయది కన్నీ రేమి వైకుంఠమో.

ఎంతటి వెఱ్ఱితల్లివౌగదే ఋణమన్నది తీరె నీకు నా
కింతటితోడ నీ వెఱుఁగ కెప్పటియట్టులె నవ్వుకొంచు నా
సంతిక ! పూలరెక్కలను జూచుచునుంటివ ? యౌనులెమ్మ యీ
సుంతయునేని ముందెవరు చూడఁగ వచ్చెదరమ్మ యియ్యెడన్.

క్రమముగ దాటిపోయి శిశుగండములెల్ల లవంగి నేటికా
లమునకు గాదటమ్మ కనులంబడె దీ రఘురాము మోముపై
నమరిన స్వేదబిందులటు లందపుటిక్కలఁ బూలమొగ్గలన్
నిముసములేగదమ్మ యిక నీ సొబగున్ నిను జూడ నోచుటల్.

ఎట్టుల పెంచుకొంటి నిను, నెక్కడ నొచ్చెదవో యటంచు నిన్
ముట్టగనైన లోవెఱతు ముట్టెను నాఋణమెల్ల నేటితో
పటీ ! శయించి నీ చివురుపానుపుపై ఫణిరాజశయ్య సు
న్నట్టె సుఖించె నా దశరథాత్మజు డోలవలీమతల్లికా.

తిరుగన్ జూడఁగరా నికెప్పటికి నీ తీర్థమ్ము పంపాసరో
వరమా ! యీ యొకసారితో సరిసుమా ! వత్సమ్మనే చూడు మే
మరకే వేళను నాకు మారుఁగను గోమాణిక్యమా ! రమ్మ నా
హరిణమ్మా ! కడసారి మూర్కొనఁగనిమ్మా పోవ ప్రొద్దయ్యెడిన్.

కని పెంచిన పితృపాదుల
కును గలుగని భాగ్య మిపుడు కూడెను నీకున్
జననీ ! ఈః రాఘవు లెదియో
యనుచుండిరి వించు చేరుమమ్మా పరమున్.

## ప ర ము

ఉగ్రంబైన తపమ్మునన్ గెలిచి శీతోష్ణాది సర్వస్వమున్
జాగ్రత్ స్వప్న సుషుప్తులన్ గడచి షట్చక్రమ్ములన్ దాటి బ్ర
హ్మగ్రంథిన్ సడలించి మానససరోహంసమ్ము నీవారశూ
కాగ్రంబంతటి సూక్ష్మతన్ నిలుపశక్యంబే యిఁకెవ్వారికిన్.

ఆ హంసమ్మొక్క దేవయానముఁగ నీకై యాయితంబయ్యె నీ
దేహం బింతటితో ఘటమున్ విడిచి జ్యోతీరూపతం జెంది యా
రోహింపం గదవమ్మ విన్నదియె చేర్చున్ విష్ణులోకానకున్
సోహం సోహమటన్న దేమరకుమమ్మా ! నీవు లోలోపలన్.

అమ్మ ! మహామునీంద్ర హృదయంగమమైన మనోవిహంగమా
గ్ర మ్మిది యే జనుశ్శతపరంపరలన్ గడియించుకొన్న పు
ణ్యమ్మున జేసిగాక తరమా ? మును పొచ్చినయట్టి బ్రహ్మరం
ధ్రమున నిర్గమింపఁగ—మతంగమహర్షులు మూల మింతకున్.

శబల బ్రహ్మము నావరించిన ప్రపంచం బట్లు సర్వంబునన్
గుబుసంబట్లు శరీర మియ్యది యు నీకుం గల్గె నివ్వానలో
శబరీ ! రూపమునం దరూపతను సాక్షాచ్ఛ్రీవైకుంఠమ్మునన్
దబిసుల్ మున్నెవరందఁజాలని విముక్తత్వమ్ముఁ గై సేయుమీ.

వై కుం ఠ ము

అదిగో ! ద్వారము ద్వారమున్ దనకుఁ దా నైవీడెడుం జూడు మ
ప్పది ముక్కోటుల దేవతల్ నిలిచి రంబా ! పూలదోయిళ్ళతో
నెదురుం జూచుచు నిర్నిమేషతను లక్ష్మీశుండు వేంచేయునో
ఒదుగుల్ వోవుచునున్నవారు మునుముం దున్నట్టి దిక్పాలకుల్.

వికచస్వర్ణసరోజఘోయన మణిస్వ్యపస్థలిన్ బారిజా
తకమధ్యస్థితమై సుధాసరసిపొంతన్ గోటిసూర్యోదయా
ధికలావణ్యమయస్వరూపము మెయిన్ దృగ్దృశ్య భేదమ్ము ద్ర
ష్టకు రానీని వికుంఠమే స్థిరనివాసం బంబ నీకింతటన్.

హరుఁ డాడున్ నటరాజవేషమునఁ దోడ్తై శ్యామలాదేవికి
న్నెరమీటన్ హరివాసరోత్సవపు సందెన్ వచ్చి యేపేట శ్రీ
హరి యాస్థానములోన బ్రహ్మ లయవేయన్ శబ్దముంగొల్ప భృం
గిరిటుం డయ్యది నందికేశ్వరుఁడు మ్రోగింపన్ మృదంగంబునన్.

హరి మోహిన్యవతారధారియయి యాహ్వానించి పేర్వేరునన్
సురలై యుండెడివారి కెల్లరకు బంచున్ ద్వాదశీపారణన్
జరుపన్ దివ్యసుధారసం బనుభవించన్ వచ్చు వైకుంఠమం
దిరమం దీవును వానిలోన నొక జ్యోతీరూపపై యుండుటన్.

పువులం దీయఁగఁ బారిజాతము హరిన్ బూజించుకోవచ్చు నెం
డవడంగా హరిచందనద్రుమమునీడన్ జేరి తృప్తిల్లఁ జ
ల్లవడన్ గల్పకమిచ్చు కమ్మని ఫలాలన్ సాపడన్ వచ్చు న
ల్లవికుంఠమ్మున నెల్ల సౌఖ్యములు కొల్లల్ కొల్లలో యంబికా.

## శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రిగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఉమర్ ఖయ్యాం | 1 | 0 | 0 |
| 2 | బృందావనం | 1 | 0 | 0 |
| 3 | శబరి | 1 | 0 | 0 |
| 4 | పంచవటి | 1 | 0 | 0 |
| 5 | శృంగార చాటువులు | 1 | 0 | 0 |
| 6 | మృత్యుంజయం | 1 | 0 | 0 |
| 7 | సుభాషితము | 1 | 0 | 0 |

## శ్రీ వేదాంతకవిగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కెరటాలు | 1 | 0 | 0 |
| 2 | కవితా సంస్థానం | 2 | 0 | 0 |
| 3 | అవ్వాయ్ చువ్వాలు | 0 | 12 | 0 |
| 4 | దండయాత్ర | 1 | 0 | 0 |
| 5 | వరదలు | 1 | 0 | 0 |
| 6 | గడుగ్గాయి | 1 | 0 | 0 |
| 7 | చినరసాలు | 0 | 8 | 0 |
| 8 | భగవన్మతభాష్యం 1 వ భాగము | 1 | 4 | 0 |
| 9 | డిటో 2 వ భాగము | 1 | 0 | 0 |
| 10 | నాయుడుబావ | 1 | 0 | 0 |

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఆంధ్రపౌరుషము | 0 | 6 | 0 |

వలయువారు:—

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి